ఔషధంబుల పాళ్ళకు హర్షమనుచు
విష్ణుబైరాగితోఁ బల్కె విశదముగను.

తా. పాదరసముశుద్ధిచేయుప్రకారము— కందదుంపరసమును, గుంటకలగరాకు రసమును, వావిలాకురసమును, జిల్లేడుపాలును, నల్లేరురసమును, కలినీళ్ళును, ఉసిరికాయరసమును, కరక్కాయరసమును, తాడికాయలరసమును, రేలాకురసమును , రాతిసున్నపునీళ్లును, చిర్రికూరరసమును, దొగ్గలికూర రసమును, పచ్చపసుపు రసమును, గేదెపెరుగును, కిరిదూపమును, గలిజేరు రసమును, నిమ్మపండ్ల రసమును, ఈచెప్పిన రసములను ఒక్కొకజాము నూరి గుడ్డను వడపోసిన నేడుదోషములు పోయి చల్లగా నుండును. ఔషధముల పాళ్ళకు హర్షముగా నుండును.

44. తాళకము శుద్ధి.

సీ. పత్రితాళకమును పరిశుద్ధి వినరయ్య
పచ్చనరేకు లింపలర జేసి
ఆరేకులన్నియు పటికెలోపల బెట్టి
అందులోపంచిత మమరఁబోసి
పదమూఁడుజాములు పటిమగా మంటచే
చక్కగా శుద్ధియౌ సరసముగను
శుద్ధియౌనొకరోజు సున్నముతో వండ
జంబీరరసమున జాముశుద్ధి
గీ. ఔషధపుపాళ్ళకిదియును నందియుండు
శుద్ధిగలిగిన జనులకు సుఖమునిచ్చు
శుద్ధిగాకున్న రోగుల సుఖము చెడును
విష్ణుబైరాగితోఁ బల్కె విశదముగను.



తా. తాళకము రేకులుగావలిచి అవికుండలో బెట్టిపంచితము పోసి పదమూఁడుజాములు పటిమగా మంటవేసిన అనుకూలమయినటువంటి శుద్ధియవును. ఒకదినము సున్నపునీళ్ళతోనువండ శుద్ధియవును. నిమ్మపండ్లరసమున నొకజాము ఉడికించిన శుద్ధియవును. ఔషధములలోనికి అనుకూలముగానుండును. శుద్ధియయినతర్వాత శుభమునిచ్చును. శుద్ధిగాకున్నపక్షమున సుఖము చెడిపోవును. అని విష్ణుమూర్తిబైరాగితో విశదముగా చెప్పినాడు.

గంధకశుద్ధి.

సీ. ఘనులారవినరయ్య గంధకశుద్ధియు
కలినీళ్లు కలబంద కలగరాకు
ఆవుపాలును ఘృతమడ్డసరమ్మును
మొగిలిగజ్జెరుమును మోదుగయును
ఇన్నిరసంబులు సివిచట్టిలోబోసి
చట్టిమీఁదనుబట్ట సర్దిక
గంధముపొడిగ గట్టిగానూరియు
గుడ్డపైఁబోసియు కూర్మితోను
గీ. బొగ్గునిప్పులు బొరుసులోఁబోసిమరియు
చట్టిమీఁదను బెట్టినచక్కగాను
పచ్చజొన్నలరీతిని బారుననుచు
విష్ణుబైరాగితోఁ బల్కె విశదముగను.

తా. గంధకము శుద్ధిచేయు ప్రకారము కలినీళ్ళును, కలబందయు, గుంటకలగరాకురసమును. ఆవుపాలును ఘృతమును, అడ్డసరము,గలిగిజేరు, మొగలిరసములును, మునుమోదుగరసమును ఈరసములన్ని ఒకచట్టిలోబోసి ఆచట్టిమీఁదను బట్టవాసెనగట్టి బొగ్గునిప్పును బొరుసులోబోసి చట్టిమీఁదనుపెట్టిన పచ్చజొన్నలవలె కుండలోనికిదిగును. అమృతశిల గంధకమవును.

46. తామ్రశుద్ధి.

సీ. రాగిరేకులువేసి రంగుగాఁగాల్చియు
నులవనీళ్ళనుముంచి యుంచవలయు
తరువాతదీసియు తరుచుగాగూర్చియు
మత్స్యాక్షిరసమున మరలముంచి
తీసికాల్చియునది తింత్రిణీరసమున
ముమ్మారుగాల్చియు ముంచవలయు
ఏడుమారులుగాల్చి యెమ్మెచల్లనుముంచ
శుద్ధిగలుగునిది శుభమునిచ్చు
గీ. అదియుఁదగశుద్ధిగాకున్న హానివచ్చు
బుద్ధిమంతులునెవరైన భూమిలోన
సరసముగఁ జేయుఁడీరీతి చక్కఁగాను
విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను.

తా. రాగిరేకులు ఎర్రగాఁగాల్చి ఉలవనీళ్ళనుముంచి తరువాతదీసి తరుచుగా కాల్చి పొన్నగంటిరసములోముంచి తిరుగదీసికాల్చి చింతాకు పసరులో ముమ్మారుముంచి యేడుమారులు కాల్చి యేడుమారులు పులిచల్లలోముంచిన శుద్ధియవును. ఈతామ్రము శుద్ధికాకపోయిన హానివచ్చునుగనుక చక్కఁగ పయిన చెప్పినప్రకారము శుద్ధిచేయవలసినది.

47. పంచలవణశుద్ధి.

సీ. లవణమ్ముసైంధవలవణమ్ముకలితోడ
మర్దించియార్చిన మంచిశుద్ధి
సౌవర్చలవణమ్ము సరసమౌగోమూత్ర
మునశుద్ధిపొందును ముదముమీర
లక్ష్యంబుగల బిడాలవణంబుచల్లచే
మర్దించియెండింప మహిమగలదు
కలిజేరురసమున కాచలవణమును
కలిపియెండించినగలుగుశుద్ధి
గీ. తింత్రిణీపత్రరసమున దీశితడిపి
ముఖ్యముగ వేచశుద్ధి సముద్రలవణ
పంచలవణాలశుద్ధి యీపగిదిననుచు
విష్ణుబైరాగితోఁ జెప్పె విశదముగను.

తా. సైంధవలవణము కలిబోసినూరిన శుద్ధియవును. సౌవర్చలవణము గోమూత్రమునునూరి యార్చిన శుద్ధియవును. బిడాలవణము పులిచల్లతో మర్దించి యెండించిన శుద్ధియవును. చింతాకు రసమున దడిపి సముద్రలవణము వేచిన శుద్ధియవును. అయిదులవణములశుద్ధులు నీరీతిగా జేయవలెను.

48. గుగ్గిలముశుద్ధి.

సీ. వినరయ్యమీరలు విమలమౌసున్నపు
నీళ్ళనుమర్దించి నేర్పుగాను
ఆవుపంచితమును నరటిసానయుఁగల్పి
కుండలోఁబోసియుఁ గూర్మితోడ
యంత్రానఁ దగరెండు యామముల్వండించి
చల్లార్చిననుశుద్ధి చక్కఁగాను
సారిదిగుగ్గిలమును కరకతాడిరసాన
నరగడెనూరియు ననువుగాను
గీ. ముద్దఁగాజేసి గుడ్డను మూటగట్టి
నాల్గుగడియలు వండిన నయముగాను
శుద్ధివచ్చును జనులకు సుఖముననుచు
విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను.

తా. విమలము శుద్ధిచేయుప్రకారము. గుగ్గిలమునున్నపునీళ్ళనునూరి ఆవు పంచితమును, అరటిచెట్టురసమును, కలిపి ఈమూడున

ములును కుండలోపోసి యీవిమలము మూటగట్టి వుల్లను వ్రేలాడ గట్టి కుండలో మీదనుంచి దోలాయంత్రమున రెండుజాములు వండి చల్లార్చిన శుద్ధియగును. ఈగుగ్గిలము కరకతాడికాయల రసమున అరగడియనూరి అవి ముద్దచేసి గుడ్డనుమూటగట్టి నాలుగుగడియలు వండినశుద్ధియై మానవులకు శుద్ధినిచ్చును.

49. 1 ఇంగువశుద్ధి, 2 యవక్షారశుద్ధి, 3 సజ్జాక్షారశుద్ధి,
4 సజ్జాకారశుద్ధి, 5 గజపిప్పళ్ళశుద్ధి.

సీ. కలిసజ్జక్షారము కలిపి మర్దించిన
నంతలో శుద్ధియౌ నారెనేని
యెరడాపుకడుగుతో యవక్షారమునునూరి
తడిపి యార్చినశుద్ధి తప్పకుండ
సజ్జకారముశుద్ధి చనుబాలనూరియు
నీడనార్చినశుద్ధి నిజముగాను
గిట్టిమూకుటిలోన గజపిప్పలినివేసి
వేచినశుద్ధియు వేగమవును
గీ. అరయనరవిందరసమును నమరదీసి
యింగువయు జామునూరిన నింపుశుద్ధి
శాస్త్రసమ్మత మిదిమీరు సల్పుడనుచు
విష్ణుభైరాగితో బల్కె విశదముగను.

తా. కలితోను సజ్జాక్షారము కలియనూరి ఆర్చిన శుద్ధియౌను. యరడపుకడుగుతోను యవక్షారముతడిపి యార్చిన శుద్ధియౌను. సజ్జాకారముచనుబాలనుడికించిన శుద్ధియవును. గజపిప్పళ్లు మూకుట్లోవేసి వేయించిన శుద్ధియవును. తామరాకు రసముదీసి యింగువజాముసూరిన శుద్ధియవును. ఇది శాస్త్రసమ్మత మయినది.



50. బంగారము శుద్ధి.

సీ. బంగారుశుద్ధిని బాగుగా వినరయ్య
వెలిగారమునుగల్పి వేగ గరిగి
యెమ్మ రేకులుజేసి యెర్రమురదనిండ
నలదియు నదియును నగ్నినార్చి
యారేకులుగడిగి యావుపాలను జాము
నుడికించగా జాల యుత్తమవు
ఉడికించవలె వెన్క నులవనీళ్ళను జాము
పటిమగా నుడికించి పంచితమున
గీ. కలిని నొకజాముడికినను గట్టిగాను
కల్మషముబాసి కనకము కాంతివచ్చు
నెవరు నీరీతిచేసిన నెన్నికనుచు
విష్ణుభైరాగితోబల్కె విశదముగను.

51 సూతకభస్మము.

సీ. బడబాగ్నిమూలము పటికదుత్తూరము
కలబంద హేరండ కటుకత్రయము
ఆవాలునుప్పును నార్ద్రకసౌవీర
మును వీటిలోసూతము విడవలయు
కల్వమ్మునంబెట్టి కలియంగ మర్దించి
కుప్పియుగా జేసి కుండలోన
సాముద్రమునుబోసి సరగున నిదిబెట్టి
మీద సాముద్రంబు మిన్న జేసి
కుండపై మూకుడు కుదురుగా జేసియు
గుడ్డమన్నునుజుట్టి గురిగజుట్టి
బాగుగాపొయిమీద భాండమ్ము బెట్టియు
పదిజాములునుమంట పట్టబల జేసి

శీతలంబునఁదీసి శీఘ్రముగను చట్టి
చుట్టుమన్ చదరగ సారిది జేసి
గీ. బట్టదీసిన పైకుండ బట్టియందు
తెల్లగా భస్మమైయుండు తేజమెసఁగ
సూతభస్మంబు చేసెడి సూటియిదియు
విష్ణుబైరాగితోఁ బల్కె విశదముగను.

తా. చిత్రమూలము వేరును, పటికయు, ఉమ్మెత్తవేరును, కలబందయును, ఆముదపువేరును, శొంఠి, పిప్పలి, మిరియాలును, ఆవాలును, ఉప్పును, అల్లమును, సౌవీరమును, వీని అన్నిటిలోను, పాదరసమునూరి కల్వములో ఉంచి మర్దించి కుప్పెజేసి కుండలో ఉప్పుపోసి ఆపైని ఈకుప్పెపెట్టి ఆమీదను ఉప్పుపోసి కుండమీద మూకును కుదురుగా జేసి గుడ్డజుట్టి మన్నుచుట్టుమెత్తి యీకుండ పొయిమీద బెట్టి పదిజాములు మంటబెట్టి చల్లారినతర్వాత తీసి కుండ అంచుచుట్టుమన్ను విప్పివేసి కుండమీద మూకుడు తీసిన మూకుడును పట్టుకొనియుండును.

52. రసభస్మగుణము.

సీ. పారదభస్మము పటిమ జెప్పెదనయ్య
శొంఠిపొత్తును జేసి సొంపుగాను
అగ్నిరసంబున నదిగాఁ డెమర్దించి
అయిదుపూటలు దినుఁ డౌషధమును
సప్తదినమ్ములు చప్పిడిచేసి యు
నెనిమిదింటను నుప్పు దినఁగవలయు
పక్షంబునీరీతి పథ్యంబు జేసిన
వాతగుల్మములను వాయువులను
గీ. మూర్ఛ గళరోగశూలలు మూత్రకృఛ్రి
గండమాలలు కుష్టువుల్ కడకుఁదొలగు



కడుపునొప్పులు మాన్పును కఫమునడఁచు
విష్ణుబైరాగితోఁ బల్కె విశదముగను.

తా. పాదరసముయొక్క గుణము, శొంఠి యీభస్మములో వేసి చిత్రమూలపురసమున ఒకగడియనూరి అయిదురోజులు పుచ్చుకొని యేడురోజులు చప్పిడిఅన్నము తినవలయును. ఎనిమిదవరోజున ఉప్పువేసికొనవలెను. పదునేనురోజులీలాగున పథ్యము జేసిన వాతగుల్మములును వాయువులును, మూర్ఛరోగములును, గళరోగములును, శూలలును, మూత్రకృఛ్రరోగములును, గండమాలరోగములును, కుష్ఠరోగములును, కడుపునొప్పులును మానును. కఫములణఁగును.

53. అభ్రకభస్మము.

సీ. వైద్యులందఱుమీరు వరుసగా వినరయ్య
యభ్రకంబులు నాలుగవనిలోన
అందునాల్గిటనొక్క డమృతంబునరివచ్చు
కృష్ణాభ్రకంబును గూర్మితోను
రాతిరోటనదియురజముగ దంచియు
కలిబోసికాచిన గలుగుఁ శుద్ధి
కలువంబుననిడియు కలితోడమర్దించి
మూకుడులోబెట్టి మూతగప్పి
మూడుపుటమ్ములుముదమొప్పఁగా వేసి
యది యావుపాలతో నమరనూరి
గజపుటంబులుమూడు గట్టిగా వేసియు
నర్కక్షీరముచేత నారవేసి
గీ. కుంజరాశనరసమునఁ గూర్మిమూఁడు
మఱియునులవలనీళ్ళను మరలనాఱు
నిన్నిపుటములభస్మమౌ నింపుగాను
ఔషధంబుల నిడవచ్చు హర్షముగను.

తా. వైద్యులందఱు వినవలసినది. భూమియందు నాలుగు అభ్రకములుగలవు. ఇందులో అమృతముతో సమానమయినది కృష్ణాభ్రకము. ఆయభ్రకమును రాతిరోటను వేసి చూర్ణముగాదంచి కలి పోసిఉడికించిన శుద్ధియవును. ఇది కల్వములోఁబెట్టి కలితో మర్దించి మూఁకుడులోఁబెట్టి పయినమూకుడుగప్పికలిని నూరియదిమూఁడుపుటములు వేసినతరువాత జిల్లేడుపాలతోను, రావిచెక్కరసాననూరిమూఁడుపుటములువేసి మఱియూడలరసాననూరి మూఁడుపుటములు వేసియులవనీళ్ళనునూరి మూఁడుపుటములు వేసియిన్నిరసములచేతను పుటములువేసిన యుక్తమయిభస్మమవును. ఔషధమువాడుకకు అనుకూలముగానుంచవచ్చును. ఈతీరున వేసినభస్మముబహు శ్రేష్ఠమవును.

54. సింధూరభస్మము.

సీ. అభ్రికసింధూర మదిచేయువిధమును
వినుడయ్యచెప్పెద పెద్దలార
కలబంద కానుగ గలిజేరుసర్పాక్షి
పొన్నగంటిసుగంధి పొలుపుమీఱ
దుష్టుపుపెన్నేరు దూలగొండియునుప్పి
కారుములగ నల్ల కలవదుంప
భూతులసి పలాశముండులుభృంగియు
నేలగుమ్మడియును నేలతాడి
వావిలడ్డసరంబు వాకుడుగదంబ
జెముడుజంబును నిమ్మకఱ్ఱముగాను
ఒక్కొక్కరసముతో నొక్కొక్కదినమును
మర్దించిపుటముల మరఁగవేయ
అభ్రికసింధురం బవునద్భుతమ్ముగ
సురలకు సుధయెట్లొ సులభముగను



గీ. జనుల కమృతంబు నిదియును జగతిలోన
నిదియుభక్షించువారికి నిహముపరము
మృత్యుభయమును దప్పించు ముదము నిచ్చు
విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను.

తా. అభ్రికసింధూరముచేయు ప్రకారము చెప్పెదను. కలబందను, గానుగను, గలిజేరును, సర్పాక్షిని, పొన్నగంటిని, సుగంధిని, దుష్టుపురసంబును, పెన్నేరును, దురదగొండియును, నుప్పిరసమును, కారుములగాకును, నల్లకల్వదుంపలును, భూతులసియు, మోదుగయు, గుంటకలగరయు, భోడసరమును, నేలగుమ్మిడియు, నేలతాడియు, వావిలియు, అడ్డసరమును, వాకుడును, కడిమి, జెముడును, నేరేడును, నిమ్మరసమును, ఒక్కొక్కరసమును ఒక్కొక్కదినము మర్దించి ఒక్కొక్కపుటము వేసిన అభ్రకసింధూరమవును. దేవతలకు అమృతము ఎటువంటిదో మానవులకు ఈయభ్రికసింధూరము అటువంటిది. మృత్యుభయము దప్పించి సంతోషము నిచ్చును.

55. ఉక్కుభస్మము.

సీ. ఉత్తమమైనట్టి యుక్కురాపిడిజేసి
పరగనూనెను జాము వండవలయు
జలముతోఁగడ్గి జామొండలోఁబెట్టి
నల్లతుమ్మరసమ్మునఁగిబోసి
అదినాల్గుగడియలు నమరవండియునార్చి
తీసివేగంబున దివ్యముగను
జంబునృక్షరసాన జాము సేపుడికించి
మర్దించియెండించి మరలదాని
ఆముదకరసాన నరజామునుడికించి
యొగినూరియెండించి యున్నగాని

తింత్రిణీరసముతో తిరగంగనుడికించి
 యెండించినుడికించి యెనఁగవేగ
ములగతోనూరియు ముదముతోనెండించి
 గోమూత్రమునగాచి గొప్పగాను
గీ. మూకుడునబెట్టి యామీద మూతగప్పి
 గజపుటము వేసినట్లయిన గట్టిగాను
 భస్మమైయుండునిదియును భాసురముగ
 విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను.

తా. ఉత్తమ మైన ఉక్కురాపిడిగాగోసి నూనెతోనొకజాము వండించి అది నీళ్లుపోసికడిగి ఒకజాము ఎండించి నల్లతుమ్మరసముపోసి నాలుగుగడియలువండి ఆరించి అదితీసి నేరేడురసాన జాముడికించి యెండించి మరల దానిలో నుసిరికాయరసాన నాలుగుగడియలుడికించి నూరి యెండించి చింతాకురసాన తిరుగ నుడికించి యెండించి మర్దించి యిది ములగాకురసాననూరి యెండించి గోమూత్రాన నుడికించి యిది మూకుట్లోపెట్టి ఆవయిన మూకుడుగప్పి గజపుటము వేసిన మిక్కిలి ప్రకాశమానముగా నుండును.

### 56. ఖడ్గభస్మము.

సీ. ఖడ్గభస్మంబును కల్వంబులోబెట్టి
 వినరాని రసమున విడియనూరి
అది బిళ్ళలనుజేసి యార్చిమూకుటబెట్టి
 ఆర్నొకగజపుట మమరవేసి
తిప్పతీగెరసము తీసిమర్దించియు
 పుటములేడిటువేయ బొల్పుగాను
అపుపంచితమున నరలేక తెగనూరి
 యెండించిపుటములు నేడువేయ
దుష్టుపాకురసాన దురుసుగానూరియు
 నార్చిపుటమువేయ నైదురెండు



అర్కక్షీరముతోడ ననువుగమర్దించి
 గజపుటములునేడు గాఁగజేసి
యిక్షురసమ్మున నిదినూరివిడువక
 వడిగజపుటములు వరుసనేడు
గీ. ఇన్నిపుటములు వేయగానినునికాంతి
 అవునులోహంబుమిక్కిలి యందముగను
 జనములీరీతిలోహంబు సలుపుడనుచు
 విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను.

తా. కటారికోసిన రాపిడిభస్మము కల్వానబోసి చెముడుకాడలరసాననూరి అదిబిళ్లచేసి మూకుట్లోపెట్టి యేడుగజపుటములు వేసి తిప్పతీగరసాననేడుపుటములు వేసి దుష్టుపాకురసముననూరిఆర్చియేడుపుటములు వేసి జిల్లేడుపాలతోనేడుపుటములు వేసిచెరుకుఆకురసాననేడుపుటములు వేసి నిమ్మపండ్లరసాననేడుపుటములు వేసియిన్నిపుటములునునీలాగునవేసిన సూర్యకాంతివచ్చును. ఈచందముగ లోహము అవును.

### 57. బంగారు భస్మము.

సీ. బంగారు రేకులుబలువుగావేయించి
 భస్మమువేయుట బాగుగాను
మాదీఫలరసాన మరిరసభస్మము
 గడియమర్దించియు గట్టిగాను
బంగారు రేకుల బట్టించివత్తుగా
 మూసలోబెట్టియు మూతగప్పి
గొప్పపిడకలతోడ గొప్పపుటమువేయ
 బంగారుభస్మమౌ భాసురముగ
గీ. పత్రిజలునీభస్మముందిన్న బలిబలముగను
 రాజ్యమును సిరియు సంపద రాజసమును

1683

గట్టిగా నెవరు జేసిన గల్గుననుచు
విష్ణు బైరాగితో బల్కె విశదముగను.

తా. బంగారు పల్చని రేకులుగా వేయించి మాదీఫలరసముతో మంచి రసభస్మమునూరి యీ రేకులకు వత్తుగా పట్టించి మూసలో నుంచి మీదను మూసమూసి ఆవుపేడపిడకలతోను గొప్పపుటము వేసిన బంగారము రేకులు భస్మమగును. మూసవులీభస్మమును పుచ్చుకొనిన రాజ్యమును, సిరి సంపత్తును గలుగును.

### 58. కాంతభస్మయోగము.

సీ. కాంతపురాళ్ళను కాల్చి పుల్లనిచల్ల
ముంచినశుద్ధియౌ ముదముమీర
గంధక మరపాలు కాంతంబులో పెట్టి
కొండపిండియుగొమ్ము గొరకిడాకు
ఆస్ఫోటరసమును నాకింశుకంబును
నిమ్మపండ్లరసాన నింపుగాను
ఒక్కొక్కరసముతో నొక్కొక్కయామము
నూరిమూసనుబెట్టి తోరముగను
గీ. నైదుపుటములు వేసిన మోదముగను
కాంతభస్మమునై యుండు ఘనతమిగుల
ఔషధంబులనిడుటకు నలవియగును
విష్ణు బైరాగితో బల్కె విశదముగను.

తా. కాంతపురాళ్ళు అనగా సూదంటు రాళ్ళు ఎఱ్ఱగా కాల్చి పులిచల్లలో ముంచిన శుద్ధియగును. కాంతములోన గంధకము అరపాలు పెట్టి కొండపిండియాకురసమును, కొమ్ముగొలిమిడాకు రసమును జిల్లేడురసమును, మోదుగ రసమును, నిమ్మపండ్లరసమున్ను, ఒక్కొక్క రసముతో నొక్కొక్క జాముమర్దించి మూసలో బెట్టి అయిదుపుటములు వేసిన భస్మమయి యుండును ఔషధములలోనికి అనుకూలమై యుండును.



### 59. కాంతసింధూరరసము.

సీ. కాంతభస్మములోన గలిపి హింగుళమును
సమము రెండును జేసి సరసముగను
మర్కటరసమున మర్దన జేసియు
నెఱ్ఱిమన్నుసమూస యొండ జేసి
యామూసలోనుంచి యాపైనమూసియు
యెఱ్ఱపంకము మెత్తి యెసగనార్చి
గజపుటంబులు మూడు ఘనముగా వేసిన
బాలసూర్యునిబోలి భాసురముగ
గీ. కాంతసింధూరమగునయ్య ఘనులకివియు
నేలకలవంగ దాల్చిని యేకముగను
గల్పి శర్కరతో దిన్న కాంతివచ్చు
విష్ణుబైరాగితో బల్కె విశదముగను.

తా. కాంతభస్మమును ఇంగిలీకమును సమముగా జేర్చి మూలగొండరసాన మర్దించి యెఱ్ఱమన్ను మూస జేసి యెండించి ఆమూసలోనిదియుంచి యాపైన మూతమూసి యెఱ్ఱిబురద రాచి యార్చి మూడు గజపుటములు వేసిన పొద్దుపొడుపును బోలినటువంటి ప్రకాశమానమైన కాంతిగలిగిన సింధూరము ఘనులైనవారికి యాలకులును, లవంగములును, దాల్చినిచెక్కయు నేకముగా నూరికలిపి యీ యౌషధమును పంచదారతో నిచ్చిన చాలకాంతి గలుగును.

### 60. తాళక భస్మము.

సీ. తాళకభస్మము ధవళితంబగురీతి
తెలిసినయదిఖ్యాతి దెల్పువాడ
నిమ్మపండ్లరసాన నిజతాళకమ్మును
బింకముగానూరి బిళ్ళచేసి

అపమార్గక్షారము నశ్వత్థక్షారము
కల్పికుండనుఁబోసి గట్టిగాను
ఆక్షారములమధ్య నాబిళ్ళనుంచియు
చుట్టునుమన్నింత చూరుగట్టి
కుండనుపొయిమీఁద కుదురుగానుంచియు
మూకుడొకటిపైన మూతగప్పి
పదిజాములునుమంట పటిమతో వేసిన
తేటయాభస్మమై తేజరిల్లు
తోడభస్మమువెన్నతో దిన్నయపుడు
జ్వరములన్నియు వేగ జరుగుచుండు

గీ. రోగములుబారిపోవును రోజులణఁగు
వాతపైత్యముకుష్ఠువుల్ వదలుచుండు
తాపములువాంతి జాడ్యముల్ తంద్రిగుణము
విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను.

తా. తాళకభస్మము తెల్లగా నగుప్రకారము. తాళకముని మ్మపండ్లరసమున నూరి బిళ్ళచేసి ఉత్తరేణిబూడిదను, రావికర్రలబూడిదను రెండునుకలిపికుండలోఁబోసి ఆబూడిదలమధ్యను ఈబిళ్ళనుంచి చుట్టునుచూరుగాకట్టడమును, ఆకుండపొయిమీఁదనుంచి పయిన మూకుడుమూసి పదిజాములు గాఢాగ్నిమంట వేసిన తెల్లగా భస్మముప్రకాశించుచుండును. ఈభస్మము వెన్నపూసనుకలిపి పుచ్చుకొనిన జ్వరములన్నియుజడిసిపోవును. రోగములు పారిపోవును రోజాగుణములుమానును. వాతమును, పైత్యమును, కుష్ఠమును వదలిపోవును. తాపమును వాంతి జాడ్యమును, తంద్రిగుణములును వదలిపోవును.

61. కాంస్యశుద్ధి.

సీ. కంచుశుద్ధినిమీరు గట్టిగా వినరయ్య
చింతాకుపసరున శీఘ్రముగను



పదిమార్లుగాల్చియు పసరులోముంచిన
కంచుశుద్ధియగును గడియలోన
కంచుతో సమమును గంధకమునువెట్టి
యర్కక్షీరముతోడ నదియునూరి
ఆకంచురేకుల కారారఁబట్టించి
వజ్రమూసను వేసి వరుసగాను

గీ. సప్తపుటములు వేసిన సరసముగను
భస్మమైయుండు మూసలో భాసురముగ
ఔషధంబులపాళ్ళకు నమృతమిదియు
విష్ణు బైరాగితోఁబల్కె విశదముగను.

తా. చింతాకుపసరు బోరునులోపోసి పదిమార్లు ఈ కంచురేకుల కాల్చి పసరులోముంచిన కంచుశుద్ధియవును. గడియలో కంచురేకులకు సమముగా గంధకముపెట్టి జిల్లేడుపాలనునూరియారేకులకు ఆరారగపట్టించి యేడుపుటములువేసిన అది ప్రకాశమానమైనభస్మమవును. ఔషధములపాళ్ళకు ఆకృతిస్వరూప మయి యుండును.

62. కంచుభస్మయోగము.

సీ. కంచుభస్మమురస గంధకదరదము
లివినాల్గు సమముగ నింపుజేసి
అశ్వత్థమోదుగ హంసపాదియు జంబు
దూలతామరనల్లి తుమ్మ సిమ్మ
ఒక్కొక్కరసముతో నొక్కొకదినమును
నూరిమూసనునిడి తోరముగను
ఆరునొక్కపుటమ్ము లమరంగ వేసిన
బాలసూర్యునిమించు భాసురముగ

గీ. కంచు సిం*ధూరమవునయ్య ఘనులుబాగడ
అల్లమనుపానమౌషధ మద్దిగెత్తు

అనుదినంబును దిన్నను నఘముబాయు
విష్ణు బైరాగితోబల్కె విశదముగను.

తా. కంచు భస్మమును, రసమును, గంధకమును, ఇంగిలీకము ను, ఇవి నాలుగు సమముజేసి రావిచెక్క రసమును, మోదుగచెక్క రసమును, హంసపాదియాకు రసమును, నేరేడుచెక్కరసమును, దూలతామరరసమును, నల్లతుమ్మరసము, నిమ్మపండ్లరసమును, ఒక్కొక్కరసముతో ఒక్కొక్కదినము మర్దించి మూసలోనుంచి యేడుపుటములు వేసిన బాలసూర్యుని మించినటువంటి సింధూరమవును. కంచు సింధూరము ఇది శ్రేష్ఠమని అధికులు సంతోషింతురు. అల్లపురసాన అనుపానముజేసి అర్ధగెత్తు ఔషధము నిత్యమున్ను ఈభస్మముతిన్న వారికి పాపము హరించిపోవును.

63. వంగనాగముశుద్ధి.

సీ. వంగనాగముశుద్ధి పరగెడుభస్మము
అజమూత్రిమును చల్ల యావుపాలు
నులవసిళ్ళును నూనె యుస్తియాకురసాన
నుడికించిననుశుద్ధి యుత్తమ మవు
పత్రితాళకమును పాలాశరసమున
నూరిరేకులరాచి తోరముగను
మూకుడులోబెట్టి మూతమూకుడుగప్పి
పుటమొందు వేయుడీ పొల్పుగాను
గీ. సాంగశీతలమునదీసి చక్కగాను
పాళ్ళకును భస్మమునమంచఁ బాటియగును
అరయవింశతిమేహము లంతరించు
విష్ణు బైరాగితోబల్కె విశదముగను.

తా. వంగము సీసము శుద్ధిభస్మప్రికారము ఎలాగంటె మేక పంచితమును మజ్జిగయు ఆవుపాలును ఉలవసిళ్లును నూనెయును ఉస్తి



యాకు రసమును వీట్లచేతను ఉడికించిన శుద్ధియగును, పత్రితాళకమును మోదుగచెక్క రసమున నూరి తగరపు రేకులకునిండ రాచి మూకుడులోపెట్టి పైనమూకుడుమూతగప్పి ఒకపుటము వేసిన భస్మమవును. చల్లారిన తర్వాత తీసిన ఔషధము పాళ్ళకు అనుకూలముగా నుండును. ఇరువది మేహములకు పెట్టవచ్చును.

64. వంగ సింధూరము.

సీ. వంగసింధూరము వరుస మీకెరిగింతు
అజమోదరసమును నడ్డసరము
బోడసరమ్మును బోసిమర్దించియు
తమలపాకురసాన తరచినూరి
ప్రమిదలోబెట్టియు ప్రమిదమీదనుగప్పి
నాలుగు పుటములు నయముతోడ
వరుసగా వేసిన వంగసింధూరమా
జనులెవ్వరునుదిన్న జాడ్యములును
సీ. మూత్రికృచ్ఛ్రలు మేహముల్ మూలవ్యాధి
తాపమునురక్తకాసయు తంద్రిగుణము
ఇన్ని రోగంబులకునిది యీయుడంచు
విష్ణుబైరాగితోబల్కె విశదముగను.

తా. తగరము సింధూరముచేయు ప్రికారము చెప్పెదను. వాము, అడ్డసరమును బోడసరమును పోసి మర్దించి తమలపాకు రసానమర్దించి ప్రిమిదలోబెట్టి పైనమూసి నాలుగు పుటములు వేసిన నిది వంగ సింధూరము. ఇది యెవరు పుచ్చుకొన్నను జాడ్యములు మూత్రికృచ్ఛ్రరోగములును మేహరోగములును, మూలవ్యాధులును, తాపములును, రక్తకాసలును, తంద్రగుణములును ఇన్నిరోగములకును ఇది యియ్యవచ్చును.

65. రజతభస్మయోగము.

సీ. వెండియు రేకులు వేయించి పలుచగాఁ
బోతుకాకరరసము దగఁదీసి
ఆ రేకులన్నియు నారసమ్మునఁగాల్చి
ముంచినశుద్ధియౌ నంచితముగ
కాకమాక్షికమును గల్వంబులోఁ బెట్టి
యర్కక్షీరముతోడ నరయనూరి
యా రేకులకునిండ నంటించి యార్చియు
మూకుడులోఁ బెటి మూతగప్పి
గీ. గజముపొడవున పుతమును గట్టిగాను
వేసినను వెండిభస్మమౌ వేగముగను
అద్దిభక్షింవుచున్నను పఘముబాయు
విష్ణుబైరాగితోఁ బల్కె విశదముగను.

తా. వెండిరేకులు పలుచగా వేయించి పోతుకాకర దుంప రసముదీసి ఆ రేకులన్నియు ఆరసములోపల ముంచి కాల్చిన శుద్ధియవును. కాకమాక్షికము జిల్లేడుపాలతోనూరి ఆ రేకులకు పట్టించి ఆర్చి మూకుడులోనుంచి మూతగప్పి గజపుతము వేసిన భస్మమవును. ఈవెండిభస్మమును దినిన పాపములు పోవును.

66. శుద్ధిజేసిన గంధకము పుచ్చుకొను ప్రకారము.

సీ. పార్వతీవీర్యము పరిశుద్ధిగా జేసి
త్రిఫలములేలకుల్ త్రికటుకములు
గట్టిగానూరియు గంధకమునఁగల్పి
యరతులమ్మునుగాఁగ హద్దుజేసి
అనుదినంబును నాజ్యమనుపానములనిది
యనుభవించగవలె హర్షముగను



పప్పునన్నము నేయి పాలును పెరుగును
పలుచనిచారును పథ్యమిదియు
గీ. మండలము సేవజేసినమానవులకు
కుష్టువ్యాధులురోగముల్ కూలిపోవు
నాయురారోగ్యమైశ్వర్యమధికమగుచు
విష్ణుబైరాగితో జెప్పె విశదముగను.

తా. గంధకము పరిశుద్ధిని జేసి కరకకాయలు, తాడికాయలు ఉసిరికపప్పును, ఏలకులును, శొంఠిపిప్పలిమిరియములును ఇవి యన్నియు చూర్ణముచేసి గంధకములోగలిపి రోజునకు అరతులమువంతున రేపుమాపును నిర్ణీతముచేసి నిత్యమును నేతితో అనుపానముచేసికొని పుచ్చుకొనవలెను. పప్పు, అన్నము, నేయి, పాలు, పెరుగు, పలుచని చారును పథ్యము. నలుబదిరోజులు ఈలాగున పుచ్చుకొనిన వారికి కుష్టురోగములు మానును. ఆయువును, ఆరోగ్యమును, ఐశ్వర్యమును అధికమవునని విష్ణువు స్పష్టముగాఁ జెప్పినాడు.

ఇది బయిరాగి చేసిన ధన్వంతరి విజయమునఁ
దృతీయాశ్వాసము.

---

చ తు ర్థా శ్వా స ము.

---

67. సూతికాభరణము.

సీ. తాళకమునునాభి తామ్రమమణిశిల
పార్వతీంద్రియమును పారదమును
అమృతవంగములోహామభ్రినాగంబును
సోమటంకణకాంతహింగుళములు

శొంఠిపిప్పలిమిర్య సోపునేపాళము
తారభస్మమునీని తప్పిటమును
శంఖతుత్తక్షార జాజీఫలంబులు
మత్స్యకూర్మమయూర మనుజమకరి
చాగశార్దూలము సకివిధచేదుల
సమభాగములుగూర్చు సంఖ్యలోను
కల్వంబులోనుంచి ఘనమేఘనాదము
చిత్రార్ధజంబీర శ్రీతులసిని
అయిదుపూటలునూర నమృతమానుమాష
మాత్రప్రమాణము మాత్రగొనిన
గీ. శూచికావాతసర్వాంగ శుష్కవాత
పక్షవాతము తాపముల్ పారిపోవు
సూతికాభరణమ్మిది శుభముకలది
విష్ణుబైరాగితోఁ బల్కె విశదముగను.

తా. తాళకము, వసనాభియు, తామ్రభస్మమును, మణిశిలయును, గంధకమును, పాదరసమును, గరళమును, తగరభస్మమును, లోహమును, అభ్రకభస్మమును, సీసభస్మమును, బంగారపుభస్మమును, వెలిగారమును, కాంతభస్మమును, ఇంగిలీకమును, శొంఠిపిప్పలిమిరియములును, నేపాళములును, వెండిభస్మమును, నీలిమందును, సత్తుభస్మమును, శంఖభస్మమును, మైలుతుత్తమును, యవాక్షారమును, జాజికాయలును, చేపచేదును, తాబేటిచేదును, నెమలిచేదును, మనుష్యులచేదును, మొసలిచేదును, మేకచేదును, పెద్దపులిచేదును, చెవులపిల్లిచేదును, దున్నపోతుచేదును, ఇవియన్నియు సమభాగములుచేసి కల్వములోనుంచి నెమలిచెక్కరసమునను, చిత్రమూలపురసమునను, అల్లపురసమునను, నిమ్మపండ్లరసమునను, తులసిరసమునను, ఈ అయిదురసములతో అయిదుదినములు మర్దించిన అమృతముతోస



మానమగును. మినపగింజంత మాత్ర పుచ్చుకొనిన సూచికా వాయువులు, శుష్కవాతములును, సర్వాంగ వాయువులును, పక్షవాతములును, పారిపోవును. ఇది సూతికాభరణము.

68 వాతరాక్షసము.

సీ. తామ్రలోహ సువంగతారభస్మ సువర్ణ
భస్మముల్నాల్గు నభ్రకము మఱియు
కాంతగంధకములు కఫరినేపాళముల్
సమముగాగూర్చియు చక్కగాను
కల్వములోనుంచి కటుక త్రిరసముల
మర్దించి కుప్పెన మరగబెట్టి
సరసంబుగాకుప్పె చట్టిలోవలబెట్టి
యినుకచుట్టునుబోసి యిష్టముగను
పదునారుగడియలు పక్వంబుగావండి
దేహానుపానంబు తెలివిఁగొంది
గీ. అడ్డిగత్తునుపూటకు నమరనిడిన
వాయు రోగంబులన్నియు వదలిపోవు
శోభలును కాసశూలలు సొంపులగుచు
వాతరాక్షసమిదియును వాడిగలది
విష్ణు బైరాగితోఁ జెప్పె విశదముగను.

తా. తామ్రభస్మమును, తగరభస్మమును, లోహభస్మమును, వెండిభస్మమును, బంగారు భస్మమును, పాదరసమును, కర్పూరమును, ఇంగిలీకమును, సింధూరమును, అభ్రక భస్మమును, కాంతమును, గంధకమును, పాలతుత్తమును, నేపాలశొంఠి, పిప్పలి మిరియాలును, రసముదీసి మర్దించి గాజుకుప్పెలోనుపెట్టి కుప్పె కుండలోపెట్టి కుప్పెచుట్టు యినుకబోసి పదునారుగడియలు వండి దేహాము అనుపానము గుర్తెరిగి ఔషధము అడ్డిగత్తు పూటకిచ్చిన వాయురోగము

లు మానును. శోభలును, కానలును, శూలలును మానును. వాతరాశనము. ఇది మహా వాడిగలది.

69 ఆనందభైరవి.

సీ. చక్కనిహింగుళ చనుబాల నుడికించి
పాళ్ళు రెండుబెట్టి పగిదిగాను
శుద్ధిచేసినయట్టి శూద్రినాభియుపాలు
పంచటంకనమొక్క పాలు నల్ల
మిరియాలు నొకపాలు మేలుగా జేరిచి
జాజిఫలముపాలు చక్కగాను
నెమ్మికల్వమునను నిమ్మపండ్లరసాన
మర్దించిమాత్రల మరగఁజేసి
గీ. మూఁడుదినములు నిచ్చిన ముదముమీఱ
కడుపునొప్పులు గ్రహణులు కఫములడగు
బలిమిగలిగించు నానంద భైరవమున
విష్ణు బైరాగితోఁజెప్పె విశదముగను.

తా. ఇంగిలీకము చనుబాల నుడికించి అది రెండుపాళ్ళు శుద్ధిజేసిన శూద్రినాభిపాలు, శుద్ధిజేసిన వెలిగార మొకపాలు, నల్ల మిరియము లొకపాలు, జాజికాయ ఒకపాలు యివి యన్నియు కల్వములోఁబోసి నిమ్మపండ్లరసమున నొకదినముమర్దించి మాత్రలుచేసి దినత్రియము ఈయౌషధము పుచ్చుకొనిన కడుపునొప్పులు, గ్రహణిరోగములును మానును.

70 సన్నిపాతభైరవి.

సీ. బంగారుశేకులు బరగుఁతాళక
మొకపాలుబెట్టిన నొప్పుగాను



పార్వతివీర్యము పాలుకుబెట్టియు
సూతంబునొకపాలు సూటిగాను
మూడుపాళ్ళనునాభి ముదమొప్పగాఁబెట్టి
మెరినిమణిశిల మొకపాలు
పొంగినటంకంబు పొసఁగనొక్కపాలు
నిన్నిటికిసమమ్ము హింగుళమును
నెమ్మిశుద్ధిని జేసి నిమ్మపండ్లరసాన
రెండురోజులునూరి రేయుఁబవలు
ఓమంపురసమున నొకరోజుమర్దించి
యంత్రాన జాముసేవమరనండి
పూటకుచిన్నము పుచ్చుకొనుచున్న
దగ్గునుహిక్కయు దాపములును
గీ. కడుపునొప్పులనుమాన్పు కఫములణఁచు
విషమజ్వరములు దోషముల్విరిగిపోవు
సన్నిపాతము భైరవిసంధులణఁచు
విష్ణు బైరాగితోఁబల్కె విశదముగను.

తా. బంగారుతో సమానమైనటువంటి తాళకము ఒకపాలు ఉంచి గంధకము ఒకపాలుపెట్టి పాదరసము ఒకపాలు మూఁడుపాళ్లు నాభియుంచి, మణిశిల ఒకపాలు, పొంగించిన వెలిగారము ఒకపాలు వీని అన్నింటియెత్తు నింగిలీకముంచి యివియన్నియు కల్వములోనుంచి నిమ్మపండ్ల రసాన రాత్రింబవళ్ళు రెండురోజులునూరి చిత్రమూలరసాన ఒకదినము మర్దించి డోలాయంత్రాన వండి పూట పూటకు చిన్నము ఔషధము పుచ్చుకొనిన దగ్గును, హిక్కయు తలనొప్పియు, తాపమును, కడుపునొప్పులు మాన్పును. కఫరోగములును, విషమజ్వరములును మానును. ఇది సన్నిపాతభైరవి.

### 71 షడ్గుణము.

సీ. ఒకపాలుసూతము నొకపాలు సీసము
నొకపాలు గంధక మొప్పఁగాను
మూఁడుమూఁడునుపాళ్లు ముద మొప్పఁగాఁజేసి
కల్వానమర్దించి గట్టిగాను
కుప్పెలోఁబోసియు కుప్పెకుండనుబెట్టి
యినుక చక్కఁగఁజుట్టి యెసఁగఁజేసి
కుండపొయిమీఁదను కుదురుగానిల్పియు
గడియగడియమంట క్రమముగాను
వేయ షడ్గుణమది వేగమునయియుండు
శీతలమునఁదీయ శీఘ్రముగను
ఔషధంబునుదీసి యల్లపురసములో
కుప్పెగాఁజేసియుఁ గూర్మితోడ
కన్నెకోమలిపొడి కలియంగఁబోసియు
నావునేతనునది యడ్డిగెత్తు

గీ. అనుభవించినవ్యాధులు హతములౌను
ఛర్దిరోగముక్షయలు శ్లేష్మములు మొదలు
ఉబ్బుపాండువులుదరము లుండ వెరచు
విష్ణుబైరాగితోఁజెప్పె విశదముగను.

తా. ఒకపాలుపాదరసము, ఒకపాలుసీసము, ఒకపాలుగంధకము, ఈమూఁడును మూఁడుపాళ్లుచేసి కల్వములోనుంచి మర్దించినచూర్ణము గాజుకుప్పెలోఁబోసి కుప్పెకుండలోబెట్టి యినుక కుప్పెచుట్టుబోసి కుండ పొయిమీఁదబెట్టి పదిగడియలు మిక్కిలిగా మంటబెట్టిన షడ్గుణమైయుండును. చల్లారినతరువాత కుప్పెతీసిచిట్లగొట్టి ఔషధము తీసి అల్లపురసాననూరి కుప్పెచేసి యీఔషధములో కన్నెకోమలి చూర్ణముకలిపి ఆవునేతిని అనుపానముచేసి అడ్డిగెత్తుఔషధము అను-



భవించిన వ్యాధులు హరించిపోవును. ఛర్దిరోగములు, క్షయరోగములు, శ్లేష్మరోగములు, ఉబ్బు పాండువును ఉదరములు మొదలైన రోగములు మానును.

### 72 సూతాదిలోహము.

సీ. దరదపారదలోహ తామ్రాభ్రసింధూర
కర్పూరకాంతము గంధకమును
కరకకాయపొడిని గల్పియుపాలును
అన్నిరసంబుల నదియుదినము
అల్లపురసమును ననుపానమునుజేసి
పూటకుచిన్నము పుచ్చుకొన్న
అన్నివ్యాధులబట్టి హతమునుజేయును
దేహమారోగ్య మై తేజరిల్లు

గీ. అమరులందరికమృతమై యబ్బినట్లు
లిలను సూతాదిలోహము నిట్లుజేయు
మూలరోగంబులకునిది మూల మనుచు
విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను.

తా. ఇంగిలీకమును, పాదరసమును, లోహమును, తామ్రభస్మమును, అభ్రకభస్మమును, సింధూరమును కర్పూరమును, కాంతమును గంధకమును, కరకకాయలచూర్ణము ఒక పాలుగల్పి చిత్రమూలపురసానగల్పి అల్లపురసమున అనుపానముజేసి పూటకు చిన్నమొత్తు ఔషధముచొప్పున పుచ్చుకొనిన అన్నిరోగములు కొట్టివేయును. దేహము ఆరోగ్యముగా కాంతిగల్గియుండును. దేవతలకు అమృతమువంటిది. ఈ భూమియందు సూతాదిలోహము అని విష్ణుమూర్తి బయిరాగితో జెప్పెను.

73 వైష్ణవీరసము.

సీ. వసనాభిదెచ్చియు వెసపాలుగానుంచి
యింగిలీకముపాలు నిడఁగవలయు
కటుకరోహిణిపాలు కటుత్రికములును
నగ్నిరసమునూరి యదిదినంబు
ఒకజాముయంత్రాన నొనరంగవండిన
వైష్ణవీరసమవు వయినముగను
అడ్డిగత్తుమాత్ర లమరంగజేసియు
రేబవల్ మాత్రలు రెండు వేయ
గీ. విష్ణుక్రాంతకషాయము వీటితోను
ఆరునొకరోజుమాత్రలు హద్దుచేసి
పుచ్చుకొన్ననురోగము బూనవెరచు
విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను.

తా. వసనాభియొక్కపాలును, ఇంగిలీకము ఒకపాలును, కటుకరోహిణి ఒకపాలును, శొంఠి పిప్పలి మిరియాలు ఇవి యన్నియు చిత్రమూలరసాన మర్దించి ఒకజాము డోలాయంత్రానవండిన వైష్ణవీరసమవును. అడ్డిగత్తు మాత్రప్రమాణముచేసి రేపుఒకటి మాపుఒకటి రోజునకు రెండేసిచొప్పున విష్ణుక్రాంతకషాయముతో నేడురోజులు హద్దుచేసి యిచ్చిన నానారోగములు వెరచును.

74 మేహాంతకరసము.

సీ. ముత్యభస్మంబును ముందుగానొకపాలు
పగడభస్మము రెండు పాళ్ళునుంచి
తామ్రభస్మంబును తగమూడుపాళ్లును
నాగభస్మంబును నాల్గుపాళ్లు
అమరఁగాఁదగులోహ మైదుభాగంబులు
కాంతమారునుపాళ్ళు క్రమముగాను



అభ్రకభాగము నభ్రసింధూరమ్ము
వంగమెనిమిదిపాళ్లు వరుసగాను
కల్వములోమంచి కచ్చూరరసమున
నుప్పిబూరుగ చెర కుస్థిరసము
అయిదుదినంబులు ననువుగామర్దించి
పూటగడ్డియెత్తుపుచ్చుకున్న
వాతంబు శ్లేష్మంబు పైత్యంబు మరిపాండు
క్షయరోగములును నాశంబునొందు
గీ. మూత్రకృఛ్రలు మేహముల్ మూర్ఛమొదలు
సకలవ్యాధులు మానంగఁజాలియుండు
మేటిమేహాంతకరసమ్ము మేలునిచ్చు
విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను.

తా. ముత్యాలభస్మము ఒకపాలు పగడభస్మము రెండుపాళ్లు తామ్రభస్మము మూడుపాళ్ళు సీసభస్మము నాల్గుపాళ్ళు లోహము అయిదుపాళ్ళుకాంతము ఆరుపాళ్ళు అభ్రకసింధూరము ఏడుపాళ్ళు తగరభస్మము ఎనిమిదిపాళ్ళు ఇవి అన్ని కల్వములోఉంచి కర్పూరరసమునసూరి ఉప్పిరసమును బూరుగరసమును చెరుకురసమును ఉస్తిఆకురసమును ఈ అయిదురసముల మర్దించి పూటకు అడ్డిగత్తు ఔషధముపుచ్చుకొనిన వాతమును పైత్యమును శ్లేష్మమును వణకురోగములును పాండురోగములును క్షయరోగములును పోవును. మూత్రకృఛ్రరోగములును మేహరక్తరోగములును, మూర్ఛలును సమస్తరోగములును మానునటువంటి అధికారముగలదు. ఈ మేహాంతరసము చాలమేలుచేయును. అని విష్ణుమూర్తి బయిరాగితో విశదముగాఁబలికినాఁడు.

75. కాలకూటరసము.

సీ. రుద్రలు నాభియురుషులును దరదము
ఋతువులుసూతము యాషిగోను

దారలుదాళక దామ్రిపువస్తువుల్
పార్వతివీర్యము బ్రాహ్మిణములను
మద్రుంచిమణిశిల సంధియు త్రిఫలము
కరకంఠ నేత్రిముల్ కటుకములును
సూర్యుడు చంద్రుడు శుద్ధినేపాళము
వేడిటంకణమును వేదములను
పంచమూలరసాన పంచదినమ్ములు
మర్దించినంజాల మహిమగలద్ధు
కాలకూటరసంబు గలిగెనటంచును
గరళకంఠుడు మెచ్చె ఘనముగాను
ఆర్ద్రికశొంఠిరసాన్వితౌషధమును
ననుదినమునుదీని ననుభవింప

గీ. గళపురోగముగవలును గండమాల
వాయువులుక్షయాలుసింధులువాంతిజాడ్య
పక్షఘాతంబుతాపముల్ పారిపోవు
విష్ణుబైరాగితోబల్కె విశదముగను.

తా. పదకొండుపాళ్లునాభిఉంచి ఏడుపాళ్లుఇంగిలీకము పాదరసముఆరుపాళ్లుంచి తొమ్మిదిపాళ్లుతాళకముంచి ఎనిమిదిపాళ్ళుతామ్రిభస్మముంచి అయిదుపాళ్లు గంధకముంచి ఆరుపాళ్ళు మణిశిలయుంచి మూడుపాళ్లుకరక తాడి ఉసిరికలుమూడుపాళ్ళు శొంఠిపిప్పలిమిరియాలురెండుపాళ్ళు నేపాళమునుఉంచేది. నాల్గుపాళ్ళుపొంగించిన వెలిగారము చిత్రిమూలమును జిల్లేడువేరును ములగవేరును వరగోగు వేరును దుష్టపువేరును అల్లపురసమును. ఈరసాలను అయిదుదినములుమర్దించిన మహిమగల కాలకూటరసము ఘనమైనటువంటిదని ఈశ్వరుడుమెచ్చెను. అల్లపురసమును శొంఠిరసమును అనుపానముజేసి యీయౌషధమునునిత్యమును అనుపానముచేతపుచ్చుకొనిన గళరోగమును



దగారోగములును గండమాలరోగములును వాయువులు క్షయలు సన్నిపాతములు పక్షవాయువులును తాపములును వాంతిజాడ్యములును ఈరోగములన్నియుపోవునని విష్ణుమూర్తి బైరాగితో బలికినాడు.

76 యోగినీ రసము.

సీ. హారునివీర్యమ్ము నమరశిలగంధము
నాభియుసిరికయు నాగరసము
తాడిపిప్పలిమిర్య తాళకటంకణాల్
సమరసగాజేసి సరిగనివియు
వీటికిసగముగా విరియునేపాళము
లలిభృంగి నిమ్మపండులరసాన
నాల్గువిధమ్ములు నయముగానూరియు
మాషమాత్రిలుచేసి మంచిగాను

గీ. వహ్నిరసముననిచ్చిన వాయువులును
కుటిలమొదలించిరోగముల్ కూలిపోవు
ప్రజలకీరసమొప్పును ప్రాణపదము
విష్ణుబైరాగితోజెప్పె విశదముగను.

తా. పాదరసమును, అమరశిలగంధకమును, నాభియును, ఉసిరికపప్పును, కరకకాయలును, శొంఠియు, తాడికాయలును, పిప్పళ్లును, మిరియములును, వెలిగారమును, ఇవి సమముగాజేసి వీటికి అరసగము నేపాళముంచి గుంటకలగరాకు రసమునను నిమ్మపండ్లరసమునను నాలుగురోజులు ఈరసముననూరి మాత్రిలుచేసి వహ్నిరసముచేతను అనుపానముచేసి యిచ్చిన వాయురోగములును కుటిలము విడగొట్టివేయును. రోగములు కూలదీసివేయును. మానవులకు ఈ యోగినీరసము ప్రాణపదమువంటిది. అని విష్ణుమూర్తి బైరాగితో విశదముగా బల్కినాడు.

### 77 లోహరసాయనము.

సీ. కత్తిరుప్పుతులమ్ము గంధకమ్ము తులమ్ము
రజితమ్ముతులమును రసముతులము
కల్వంబులోనుంచి కలగరరసమును
సాంబ్రాణిరసమును సరసముగను
వజ్రవల్లిరసమ్ము వహ్నిగజ్జేరును
కలబందయల్లము కాకరాకు
వెనసీరసంబుల విడువకుండగచాల
రెండురోజులునూరి రేయుఁబవలు
అదిబిళ్ళవలెజేసి యార్చి ప్రమిదఁబెట్టి
ప్రమిదగప్పియుమన్ను ప్రబలరాచి
గజముపొడ్గుపుటమ్ము ఘనముగా వేసియు
శీతలంబునఁదీసి శీఘ్రముగను
మునురసంబులనూరి ముదముమీరంగను
సనుదినమౌషధ మడ్డిగెత్తు

గీ. అనుభవించినజనులకు నమృతమవును
మూలవ్యాధులుమాన్పును ముదమునిచ్చు
నిద్దిలోహరసాయనం బింపుమీర
విష్ణుభైరాగితోఁబల్కె విశదముగను.

తా. కతారిచూర్ణము పాలు, గంధకముపాలు, వెండిచూర్ణముపాలు, పాదరసముపాలు, ఇవి కల్వములోనుంచి గుంటకలగరాకు రసమునను సాంబ్రాణిఆకు రసమునను, నల్లేరురసమునను చిత్రమూలపురసమునను, గలజేరుఆకు రసమునను, కలబందరసమునను కాకరాకురసమునను, ఇన్నిరసములు రెండురోజులు రాత్రిందివములు మర్దించి ఔషధము బిళ్ళగాజేసి ప్రమిదలోబెట్టి మీదను ప్రమిదగప్పి మన్ను దానిచుట్టుగప్పి గజముపొడవున పుటమువేసి చల్లారినతర్వాత



దీసి ముందుగా నూరి రసములను మరలనూరి నిత్యమును అడ్డిగెత్తు ఔషధముచొప్పున పుచ్చుకొన్నవారికిఅమృతముతోసమానమవును మూలవ్యాధులను మాన్పిసంతోషమునిచ్చును. లోకమందునలోహ రసాయన మిదియని విష్ణుమూర్తి భైరాగితోఁ బల్కినాడు.

### 78 ప్రతాపలంకేశ్వరము.

సీ. పారదాభ్రకములు పార్వతీవీర్యము
మూడుమూడగుపాళ్ళు ముదముమీర
దూడరేణముగాల్చి తోడనెభస్మము
హరనేత్రములతోడ సమగనుంచి
తగభస్మమునుచేసి దగవేసములసరి
త్రివిధసంధులుజేసి తీక్ష్ణలోహ
శూద్రినాభియుదెచ్చి శుద్ధిగాఁ జేసియు
సనుపులుగాఁజేసి సరువగాను
నిమ్మకల్వమ్మున నిగుండిరసమున
మర్దించి యొకనాడు మాపురేపు
గురివెందపూనల గురిగానుమాత్రలు
సల్పిసేవించిన జనులకెల్ల
సన్నిపాతంబులు సమసిపోయెడుసన్ని
సప్తజ్వరంబుల సంహరించు

గీ. శీతలంబును విడిపోవు శీఘ్రముగను
కఠినరోగములనుగొట్టి కడకుదోలు
కేవలం బీప్రతాపలం కేశ్వరమును
విష్ణుభైరాగితోఁబల్కె విశదముగను.

తా. పాదరసమును, అభ్రకమును, గంధకమును, ఈమూడు మూడుపాళ్ళును. పాలుకుడుచుచున్నదూడ రేణముకాల్చినభస్మము మూడుపాళ్ళు, శంఖభస్మము నాలుగుపాళ్ళు, మూడుపాళ్లులోహము

శుద్ధిజేసిననాల్గి యెనిమిదిపాళ్లు, ఈవస్తువులు కల్వములోనుంచి వావి లాకురసమున నొకదినము మర్దనచేసి గురివింద గింజవలె మాత్రలు చేసి పుచ్చుకొనిన మనుష్యులకు సన్నిపాతములును అన్నియుపోవును. ఏడు జ్వరములను కొట్టివేయును. శీతలము వదలిపోవును. కఠినరోగ ములను కొట్టివేయును. కేవలము ప్రాణమును ప్రతాపమును కలిగి నటువంటిదని ఈప్రతాపలంకేశ్వరము ఇంత మహిమగలదని విష్ణు మూర్తి బైరాగితో విశదముగా బల్కినాడు.

79 కాంతవల్లభరసము.

సీ. సొంపైనకాంతము షోడశభాగముల్
పటిమలోహముపాళ్ళు పదియునాల్గు
మంచిమండూరమమరద్వాద శాంశము
లభ్రకంబుపాళ్ళు నారునాల్గు
నెన్నికతామ్రము నెనిమిదిపాళ్ళను
నెర్రనిమణిశిల యెన్మిదియును
పచ్చిటంకణమును పాళ్లునునాలుగు
వెండిభస్మముపాళ్ళు వెలయురెండు
బంగారుభస్మము పాలదియొక్కటి
ఈశ్వరవీర్యము నిన్నియెత్తు
గంధకమంతియె కల్వంగవలయును
హంసపాదిరసాన నరయనూరి
గాజుకుప్పెనుబెట్టి ఘనముగ కుప్పెలో
గురిగ నినుకపోసి కుప్పెబెట్టి
గీ. సప్తదినములు వండిన సరసముగను
కాంతవల్లభరసమవు కాంతిగల్గి
సకలవ్యాధులనెల్లను సంహరించు
విష్ణు బైరాగితో బల్కె విశదముగను.



తా. కాంతము పదునారుభాగములు, లోహము పదునాలుగు భాగములు, మండూరము 12 భాగములు, అభ్రకము పదిపా. తామ్రభస్మ మెనిమిదిపా. రక్తమణిశిల ఆరుభాగములు, పచ్చి వెలిగారము నాలుగుభాగములు, వెండిభస్మము రెండుభాగములు, బంగారుభస్మ మొకపాలు ఈసువులయెత్తు పాదరసము, గంధకము పాదరసముతో సమానముగనుంచి యిది హంసపాదియాకురసమునమర్దించి ఈ ఔషధము గాజుకుప్పెలోనుంచికుండలో నినుకపోసి గాజుకుప్పెతో ఇసుకమధ్యనుంచి యేడురోజులు వండిన ఈ కాంతవల్లభరసము సమస్త రోగములను కొట్టివేయును. అని విష్ణుమూర్తి బైరాగితో విశదముగా బలికినాడు.

80 మృతోద్ధాపన రసము.

సీ తామ్రటంకణలోహ తాళకభస్మముల్
మణిశిలగరళము మస్తకమును
అభ్రకనాభులు నమరశిలయునజ్జ
కారముయవనద్య తౌరములును
పంచలవణములు పాషాణములుమూడు
చెంగల్వకోష్టును శివునివీర్య
కటుకత్రిరసముల కలయంగ మర్దించి
కుప్పెలోపలనుంచి కూర్మితోడ
వాలుకంబునజాము వరుసగావండియు
కలువంబునందుంచి కిలియనూరి
మత్స్యమెనోబ్బతును మాయూరమజకూర్మ
పిత్తముల్ గిల్పియు ప్రీతిగాను
దినమన్నిటపిగమర్దించి దాని నిదీసి
గురివిందలంబలె గురిగజేసి
గీ. అల్లమను పానమున నిడియనుభవింప
నన్నిరోగములనుబాపి యాయువిచ్చు

ఇదిమృతోద్ధాపనరసమై యిలను జెలగు
విష్ణు బైరాగితో బల్కె విశదముగను.

తా. తామ్రభస్మము, వెలిగారము, లోహము, తాళకభస్మము మణిశిలయు, గరళము, మస్తకియు, అభ్రకము, నాభియు, అసురశిల గంధకము, సజ్జకారము, యవక్షారము, సర్జక్షారము, సైంధవలవణము, సౌవర్చలవణము, సముద్రలవణము, బిడాలవణము, కాచలవణము, ఇవి అయిదును, ఉల్లిపాషాణము, గౌరీపాషాణము, దొడ్డిపాషాణము, చెంగల్వకోష్టు, పాదరసము, శొంఠి, పిప్పలి, మిరియాలు రసమునుతీసి నూరి కుప్పెచేసి యిసుక కుండలోబోసి ఈ గాజుకుప్పె కుండలోనుంచి జాముసంధి కల్వములోనుంచి చేపచేదు, దున్నపోతుచేదు, నెమలిచేదు, మేకచేదు, తాబేలుచేదు, ఈచేదులుగల్పి చిత్రిమూలరసమున ఒకదినము మర్దించి గురివెందపూసలంత మాత్రలుచేసి అల్లపురసము అనుపానముజేసి పుచ్చుకొనిన అన్నిరోగములను కొట్టివేసి ఆయువునిచ్చును. ఈ ఔషధము మృతినొందుటకు సిద్ధముగ నున్నవారిని బ్రతికించును. అని చెప్పినారు.

81 పూర్ణచంద్రోదయము.

సీ. పాదరసంబును ఫలములునెనిమిది
బంగారుభస్మము ఫలమునొకటి
పార్వతీవీర్యము ఫలములుపదునారు
నివిమూడుకల్వాన నిడుచు మరియు
కలబందరసమున గట్టిగామర్దించి
గాజుకుప్పెనుబెట్టి ఘనముగాను
వలయుభాండమ్మున వాలుకంబును పోసి
కుప్పెవాలుకమధ్య కూర్చిపిదప
భాండముపాయిమీద బాగుగానుంచియు
మందవేదాగ్నిచే మంటనిడుచు



మూడుదినమ్ములు ముదమొప్పనుండిన
మంకెనపువ్వు సమముయియుండు
శీతలంబునదీసి శీఘ్రముగను కుప్పె
విడజేసిమందును వెలయ జేర్చి
గీ. ఆర్ద్రికరసంబుతో గల్పి యౌషధమును
ప్రజలు దిన్నను వీర్యము ప్రబలమవును
పూర్ణచంద్రోదయమువును పూజ్యమనుచు
విష్ణుబైరాగితో బల్కె విశదముగను.

తా. పాదరసము విదిపాళ్ళు, బంగారుభస్మము పాలు, గంధకము పదునారుపాళ్ళు ఈమూడును కల్వమునసుంచి కలబందరసమున నూరి గాజుకుప్పెలోనుంచి గట్టికుండలో సిసుకబోసి యీగాజుకుప్పె యిసుకమధ్యనుంచి యీకుండ పొయిమీదనుంచి మందముగాను వడిగాను మంటవేసి యీలాగున మూడురోజులు కాల్చింపవలెను నంజీన మంకెనపువ్వుతో సమానమైన కాంతిగాను కుండ. చల్లారినతర్వాత తీసికుప్పెచిట్లగొట్టిఔషధము రొకపళ్ళెరములోనికికూడదీసికుప్పెచేసి అదిఅల్లపురసము అనుపానముచేసి ఆయౌషధము తిన్నవారికి వీర్యవృద్ధియవును. ఈపూర్ణచంద్రోదయము మహాపూజ్యమయినటువంటిదని విష్ణుమూర్తి బైరాగితో విశదముగ బల్కినాడు.

82 హేమరజతరసాయనము.

సీ. కాంచనంబుఫలమ్ము ఖడ్గముఫలమును
రజతఫలమును రసముఫలము
పార్వతీవీర్యము ఫలములునాల్గును
సివికల్వమునసుంచి యింపుగాను
వజ్రివల్లిరసాన వహ్నిరసమ్మున
నొకరోజుమర్దించి యుచితముగను

మూసలోఁ బెట్టియు మూతమ్మూసనుగప్పి
గజపుటము వేయ గట్టిగాను
గీ. హేమరజితరసాయన మెచ్చగాను
అడ్డిగెత్తౌషధము దిన మనుభవింప
జడిసిపోవునురోగముల్ జవముగాను
విష్ణుబైరాగితోఁ బల్కె విశదముగను.

తా. బంగారముపాలు కటారిచూర్ణము పాలు వెండిచూర్ణముపాలు పాదరసము పాలు గంధకము నాలుగుపాళ్లు ఇవి కల్వములోనుంచి నల్లేరురసమును చిత్రమూలపు రసమును ఈరసములను ఒక దినము మర్దించి మూసలో నీయౌషధముపెట్టి పయిని మూతవేసి గజపుటమువేసిన హేమరజితరసాయనము అనుపేరుగలది. అడ్డిగెత్తు ఔషధము పూటకు పుచ్చుకొనిన రోగములు జడిసిపోవును అని విష్ణుమూర్తి బైరాగితో విశదముగా బల్కినాడు.

83 పైత్యాంతకరసము.

సీ. ఖర్జూరఫలమున కాంతియౌ వసనాభి
ఘనమైనగరళము గంధకమును
సూతంబుహింగుళి శుద్ధినేపాళము
శొంఠిపిప్పలియును సొంపుగాను
అక్కలకర్రియు నాభీనుమిరియాలు
వెలిగారమొకపాలు వేయవలయు
ఒనరవావిలిచేత నొకనాడుమర్దించి
కలగరతోఁ రోజు కలియనూరి
జంబీరరసమున జాముమర్దించియు
మాషంబుసరిగాను మాత్రిజేసి
మాపురేపును రెండుమాత్రలుచొప్పున
మూడురోజులలోన ముఖ్యముగను



ఆరుసంధులు మానుసరవులేక విషంపు
జ్వరములు వ్యాధులువిరిగిపోవు
గీ. వాయువులు పైత్యవికారములువదలిపోవు
గుల్మరోగంబులన్నియు గూలిపోవు
నిదియు పైత్యాంతకరసమై యిలనుమించె
విష్ణుబైరాగితోఁ బల్కె విశదముగను

తా. ఖర్జూరపుపండ్లతో సమానమయినటువంటి వసనాభియు గరళమును గంధకమును పాదరసమును ఇంగిలీకమును శుద్ధిజేసిన నేపాళమును శొంఠియు పిప్పళ్ళును అక్కలకర్రియును నల్లమందును మిరియాలును వెలిగారమును వావిలాకు రసమున ఒకరోజును ఒకదినము గుంటకలగర రసముతోను మర్దించిని నిమ్మపండ్లరసమున జాముమర్దించి మినపగింజవలె మాత్రలుజేసి ప్రొద్దున ఒకటియు సాయంకాలమునందుఒకటియు నీపత్రికారమిచ్చినఆరుసన్నిపాతములును విషజ్వరములును వ్యాధులన్నియుమానును వాయువులును పైత్యరోగములును పోవును. గుల్మరోగములును. పోవును. ఇది పైత్యాంతకరసమనివిష్ణుమూర్తి బైరాగితో విశదముగ బల్కినాడు.

84 హిరణ్యగర్భరసము.

సీ. బంగారమును వెండి పగడాలుమణిశిల
తాళక చక్రాంగతాళకములు
అజదుగ్ధమునుబోసి యరజామునూరియు
వజ్రిమూసనువైచి వరుసగాను
పాడవైనపుటమొండుపొందుగా వేసియు
తీసిపాలను నదితీరుగనూరి
చక్కెరతగగల్పి సరిగ సేవించిన
కఫపిత్తద్వంద్వరోగములుమాను

గీ. శుక్లమేహమువాతముశూలలన్ని
శిరపురోగములును బోవు శీఘ్రముగను
కలినిదగుచుండును హిరణ్యగర్భరసము
విష్ణుబైరాగితోఁ బల్కె విశదముగను.

తా॥ బంగారము, వెండియు, పగడములు, మణిశిలయు, తామ్రము, కటుకరోహిణియు, తాళకము మేకపాలుపోసి నాలుగు గడియలు మర్దించి వజ్రమూస అనగా పుట్టమన్ను మూసకట్టి ఆర్చి మూసలోనుంచి గొప్పపుటము వేసి తీసితర్వాతను పాలతోనూరిపంచదారకలుపుకొని పుచ్చుకొన్నవారికి శ్లేష్మరోగములును, పైత్యరోగములును, స్వాంస్వరోగములునుమానును. శుక్లమేహములును, వాతములును, శూలలును, శిరోరోగములును పోవును. కలియుగమునకు ఈహిరణ్యగర్భరసము భుక్తిముక్తిని కలిగించునని విష్ణుమూర్తి బైరాగితో బలికెను.

85 శ్రీలక్ష్మీనారాయణరసము.

సీ. శ్రీఖండమున తామ్రి శిఖమద్ధటంకణ
తాళకములన్నైదు తప్పకుండ
నూటిమార్గములను శుద్ధులుచక్కగా
సల్పిజాగ్రతగాను జనులుమీరు
కల్వములోనుంచి గలిజేరురసమున
రెండురోజులుహూరి రేయుబగలు
జాముయంత్రమునను సరివండిమాత్రలు
జేసిపూటకును రెండేసితిన్న
గీ. శీతజ్వరములకెల్లను శీఘ్రముగను
గట్టిగాబట్టుకొను వాని గర్వ మణచి
లక్ష్మీనారాయణరసంబు లక్షణంబు
విష్ణుబైరాగితోఁ బల్కె విశదముగను.



తా. గంధకము, తామ్రభస్మము మైలతుత్థము, వెలిగారమును, ఈ అయిదును సమభాగములుజేసి ఇవిజాగ్రత్తగా శుద్ధులుచేసి కల్వములోనుంచి గలిజేరురసమున రెండురోజులు రాత్రింబగళ్ళు నూరి, ఒకజాము డోలాయంత్రమున వండి మాత్రలుజేసి పూటకు రెండేసి చొప్పున నిచ్చినయెడల చలిజ్వరముల మదమును అణచివేయును. లఘుతరమయినటువంటిది. ఈ లక్ష్మీనారాయణరసము ఇంత మహిమ గలదని విష్ణుమూర్తి బైరాగితో విశదముగా బలికినాడు.

86. బ్రహ్మాస్త్రరసము.

సీ. పాషాణములుమూడు పాలతుత్థమునాభి
అమరశిలయు గంధకాభ్రకములు
మణిశిలదరదము మంచినేపాళము
సజ్జకార సైంధవ సజ్యక్షార
లఘుతరంబగుబిడా లవణముమిరియాలు
యవక్షారటంకణా లందముగను
మాయూరతుత్థము మంచియింగువయును
ఈశ్వర వీర్యము నిన్నికెత్తు
అరవదిరోజులు ఆర్ద్రకవహ్నిను
రసముబమర్దించి రాత్రిపగలు
నొకనాడుయంత్రాన నొగివండి తీసియు
మాయూరభాగనుమత్స్యకూర్మ
సర్పజంబుకముల సమపిత్తముల్గొని
నూరి బరిణబెట్టి తోరముగను
గీ. కత్తివాల్గొసి బ్రహ్మాకపాలమందు
బెట్టిరా వినరోగముల్ బెదరిపోవు
అధికబ్రహ్మాస్త్రరసమిది యవనియందు
విష్ణుబైరాగితోఁ బల్కె విశదముగను.

తా. ఉల్లిపాషాణమును గౌరిపాషాణమును నెల్లి పాషాణమును పాలతుత్తము నాభియు అమురసిలగంధకమును అభ్రకమును మణి శిలయును ఇంగిలీకమును నేపాళమును సజ్జకారమును సైంధవలవణమును సద్యాక్షారమును బిడాలవణమును మిరియాలును యవక్షారమును వెలిగారమును మైలతుత్తమును ఇంగువయు ఇన్నివస్తువుల యెత్తు పాదరసమును అయిదురోజులు అల్లపురసమును చిత్రిమూల రసమును అయిదు దినములు రాత్రిబవలు మర్దించి ఒకదినము డోలాయంత్రిమునవండి తీసి నెమలిచేదును, మేకచేదును తాబేటిచేదును, పాము చేదును, నక్కచేదును ఈచేదులతో మర్దించి రాగిబరిణెలో నుంచి బ్రిహ్మరంధ్రిమందు పైనికొంచెముకత్తిపోట్లువేసి ఆయౌషధముబెట్టి రాచిన రోగములు బెదరిపోవును. అధికమైనటువంటి బ్రిహ్మాస్త్రరసమను పేరుగలదని విష్ణుమూర్తి బైరాగితో విశదముగా బలికినాడు.

87 రాజౌషధము.

సీ. పాషాణములునుల్లి పాషాణమునుగౌరి
పాషాణమునురెండు పాళ్ళురెండు
నాల్గురసంబులు నాలుగుపాళ్ళును
హరిదళమ్మునుగూడ నమరగాను
తాళక మొకపాలు తామ్రముపాలును
మణిశిలపాలును మంచిదగను
నెల్లిపాషాణము నెరినొక్కపాలును
గంధకమునుపాలు గలుపవలయు
కల్వాననవియన్ని గట్టిగామర్దించి
ఆవయిమూసలో నదియుబోసి
ఆ పెనుబిళ్లయు నాపైనిమూసియు
మూకిటిలోబెట్టి మూతగప్పి
గిఁయదీపాగ్నిని ఘనముగావండిన
నరయరాజౌషధం బమరియుండు



గీ. నేలకులుజీలకర్రియు నివియుదీని
నేతగల్పుగతిన్నను నేర్పుగాను
సుఖమునంగల్గుజాడ్యము స్రుక్కుననుచు
విష్ణుబైరాగితో బల్కె విశదముగను.

తా. ఉల్లిపాషాణమును, గౌరీపాషాణమును, రెండును రెండుపాళ్ళు పాదరసమును, కర్పూరమును, ఇంగిలీకమును, సింధూరమును, నాలుగురసములు నాలుగుపాళ్ళు తాళక మొకపాలును, తామ్రభస్మము పాలును, మణిశిల పాలును, నెల్లిపాషాణము పాలును, గంధకము పాలును, ఈవస్తువులు కల్వమునఁబెట్టి మర్దించి నల్లమందుమూసజేసి ఆమూసలోపోసి, నల్లమందు కొంచెము బిళ్ళచేసి మూసమీదను [illegible] ఆమూస మూకిటిలోఁబెట్టిపైని మూకుడుమూసి సీలమన్నునిచ్చి గడియ దీపాగ్నిచేతవండిన, అధికమయినటువంటి రాజౌషధమును పేరుగలిగిన రాజసుఖము కలదియౌను. ఈరాజౌషధమునకు ఏలకులును, జీలకర్రయును, నేతితోఁగలిపి పుచ్చుకొనిన సుఖజాడ్యములు సవాయి మొదలగు రోగములు జ్వరములు మానునని విష్ణుమూర్తి బైరాగితో విశదముగా బల్కినాఁడు.

88 బాలసూర్యోదయము.

సీ. అభ్రికసింధూర మైదుభాగంబులు
పార్వతివీర్యము పాళ్లుమూఁడు
దరదమూఁడునుపాళ్లు తామ్రముపాలును
ముద మొప్పలోహము మూఁడుపాళ్ళు
గవ్వలభస్మము గలిపియునొకపాలు
నాభియుపాలును నయముగాను
పదిజాములును నిమ్మపండ్లరసమ్మున
మర్దింపభాస్కరు మహిమగల్గి

గీ. బాలసూర్యోదయంబగు బాగుమీర
నల్లమనుపానముగఁదిన్న నౌషధమును
అధికరోగాదులంబట్టి హతముజేయు
విష్ణుబైరాగితోఁబల్కె విశదముగను

తా. అభ్రికసింధూరము అయిదుపాళ్ళు గంధకము మూడు పాళ్ళు యింగిలీకము ఆరుపాళ్ళు లోహము మూడుపాళ్ళు గవ్వభస్మము పాలు నాభి పాలు నిమ్మపండ్ల రసముచేతను పదిజాములు మర్దన జేసిన సూర్యునితో సమానమైనటువంటి పరాక్రమమును గలదై బాలసూర్యుడుదయించినట్టుగానే యుండును. ఈ ఔషధము అల్లపు రసము అనుపానముజేసి యిచ్చిన అధికమయినటువంటి రోగములను కొట్టివేయును. అని విష్ణుమూర్తి బైరాగితో చెప్పినాడు.

ఇదిబైరాగిచేసిన ధన్వంతరివిజయమునఁ

జతుర్థాశ్వాసము

సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

Bangalore
No. A 845/81
25-II 26
341-7-0



